విడిప్రతిక ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 102579 జులై ౯ వ తేది ౧౯౩౬ గురువారము అర్ధ సం॥ చందా రూ ౩

సంపుటము ౧౧ } తూపుబజారు, హైదరాబాదు - దక్కన్. శా. శ. ౧౮౫౮ శ్రీ ధాత సం॥ ఆషాఢ బ॥ ౫ గురువారము. ౩ మహారేనరు ౧౩౪౫ ఫ. { సంచిక ౧౫

## పంచదార పరిశ్రమ

పి. వి. రమణారావుగారు

బి. యస్సి. (ఆనర్సు) టెక్నాలజీ

ఇదివరకు వ్యాసములలో రైతునకు ముఖ్యమగు దేశీయపరిశ్రమనుగూర్చి వివరింపబడెను. ఇక ఫ్యాక్టరీలో చక్కెరను తయారు చేయు విధానమును తెలిపెదను.

### చక్కెర చేయు వివిధ పద్ధతులు

ఇదివరకు జావా మొదలగు దేశములలో ఫ్యాక్టరీలో చక్కెరను తయారుచేయు విధానమును తెలిపెదను.

### చక్కెరచేయు వివిధ పద్ధతులు

ఇదివరకు జావా మొదలగు దేశములలో ...రీలలోకూడ చాల పురాతనపద్ధతుల నవ...ండెడి. శాస్త్రపరిశోధనవేత్తలసహా...తులలో క్రొత్తక్రొత్త వింతమా... జరిగినవి. పని సులభమయిన యంత్రములు తయారైనవి. నీటి

౧) విద్యుచ్ఛక్తి (Electricity) ...ధముతైన శక్తులు అవసరమైన యం...వన్నిటిని నడిపించుచున్నవి. ఇట్లు నూ... పధానమున తయారుచేయబడు చక్కెరకు "ప్లాంటేషను వైటుషుగరు" (Plantation-White Sugar) అని పేరు. దీనిలో మరల రెండుతరగతులు [౧] సున్నము [Lime]. మరియు గంధకవాయువు [Sulphur dioxide] లతో తయారు చేయబడునది. ఈవిధాన మవలంబించు యంత్రశాలలను "సల్ఫిటేషనుఫ్యాక్టరీ" [Sulphitation Factory] అందురు, ౨. సున్నము [Lime] మరియు బొగ్గు పులుసు గాలి [Carban dioxide]తో తయారు కాబడు చక్కెర రెండవరకము. ఈవిధాన మవలంబించు యంత్రశాలను "కార్బనేషను ఫ్యాక్టరీ" [CarbanaFation actory]అందురు.3 ఈ రెండు విధానములను కూడ నవలంబించుదానిని సల్ఫిటేషన్ కార్బనేషను- ఫ్యాక్టరి అందురు. ఈపరిశ్రమ విధానమును మరలవిభజింపవచ్చును. చెఱకురసమును మొదట గంధకవాయువుతో శోధించి, పిమ్మట బొగ్గుపులుసు గాలితోగూడ శుద్ధిచేయు విధానమును సింగిల్ సల్ఫిటేషన్- సింగిల్ కార్బనేషన్, (Single Sulphitation-Single Carbanatation) అందురు. రసమునుమాత్రమే కాక వండినపాకము, అనగా సిరపు [Syrup] ను కూడ గంధక వాయువుతో శుద్ధిచేసినచో అ పద్ధతి "డబుల్ సల్ఫిటేషన్- సింగిల్ కార్బనేషన్" [Double Sulfitation Single [Carbanatation అనబడుచున్నది. రసమును, సిరపునుగూడ గంధకవాయువుతో మాత్రమే శుద్ధిచేయు పద్ధతిని "డబులు సల్ఫిటేషను" అనియు, బొగ్గుపులుసు గాలితో మాత్రమే

## పదవ అధ్యాయము

## ఫ్యాక్టరీచక్కెర పరిశ్రమ

శుద్ధిచేయుపద్ధతిని "డబులుకార్బనేషను" అనియు వాడుచున్నారు.

### చెఱకును తెప్పించి కాపాడుట

పనిప్రారంభించుటకుముందు మంచి పక్వమునకువచ్చి రసముతోనిండిన చెఱకును కావలసినదానికన్న, కొంచెము ఎక్కువగా ఎప్పుడును తయారుగానుంచుకొనుటయు, ఆ చెఱకును ఎండలో ఎండనీయక నీడలో షెడ్డులలో నుంచుటయు, యంత్రాలయము ఆగక రాత్రింబగళ్లు తిన్నగా నడుచుటకై తగినరీతిని చెఱకు ఫ్యాక్టరీకి పొలమునుండివచ్చునట్లు చూచుకొనుటయు, చెఱకుపొలమునుండి ఫ్యాక్టరీకి ౨౪ గంటలలోపున వచ్చునట్లు తగినఏర్పాటులు గావించుకొనుటయు అవసరము. ఈ విషయములు గమనింపకున్నచో పంటమంచిదైనప్పటికిని దానిలోనిరసము హరించిపోయియో లేక సూక్రోజు మారిపోయియో తగినంతచెఱకు ఫ్యాక్టరీకి సప్లై కాకపోవుటవలన చాలనష్టము వాటిల్లక తప్పదు.

### రసముతీయు విధము

చెఱకునుండిముందురసము తీయవలయును. సాధ్యమైనంతవరకు చెఱకుగడలోనున్న రసమువంతయు తీయుటకు ప్రయత్నింపవలయును. దీనికొరకై చెఱకును ఒకదానితరువాత నొకటిగా ముక్కలు చేసి. ముక్కలనుచీల్చి ఆచీలికలను పిప్పిచేసి, ఆపిప్పిని నీటిలోనాననిచ్చి బాగా మర్ధించి, రసమునంతను పీల్చి పిప్పిచేయవలెను. ఈయంత్రముల సంగమమునకే మి ల్లిం గు టా ం డెమ్ అందురు, చెఱకునంతయు వేగన్సులోనుండి,బండ్లలోనుండి ఎలక్ట్రిక్ క్రేన్సు, లిఫ్ట్సు మొదలగు వాటి సహాయముచేగాని. అధమము కూలీల సహాయమునచేగాని ఒక కేను కారియరు, (Cane Carrier) పైగుమ్మరింతురు. ఈకేనుకారియరు, చెఱకును మెల్లగా ఫ్యాక్టరీలోనికి తీసుకొనిపోవును. పైకి పోవుచున్న చెఱకుమంచి వేగములో గిరగిర తిరుగుచున్న కత్తులచే ముక్కలుగావింపబడును. ఈముక్కలు పెద్ద పళ్లుగల ఇనుపరోలర్ల మధ్యనుండిపోవును. ముక్కలువలిగి రసము క్రిందికికారును. మిగిలిన ముక్కలు కళావను ముక్కలవలె అమర్చబడిన మూడురోలర్లగ మిల్లుసందులనుండి పోవును. ఈ రోలర్లనుసన్నని పళ్లుగలవు. పై రోలరుపై హైడ్రాలిక ప్రెషరు. (Hydraulic Pressure) ఉండును. ఈప్రెషరంతయు చెఱకు ముక్కలపై పడుటచే అవి పిప్పియై మరింత నలుగును. మిగిలిన పిప్పిలో ఇంకను రసముండును. దీనిని అప్పుడు నీటిలో నానబెట్టిన రసమంతయు నీటిలో కలసిపోయి మరల పిండిగానే మరికొంత రసము వచ్చును. ఇట్లు వరుసగా 2-3 మిల్లులలో నుండి చెఱకు పిప్పిని పోనిచ్చిన చాలమట్టుకు రసమంతయు బయటికి వచ్చును. మిగిలినపిప్పి అనగా ఆఖరి మిల్లునుండి వెడలు పిప్పిని, బెగాశె, (Begasse) అందురు. దీనిలో ఇంకను చెఱకులోనున్న సూక్రోజులో వెయ్యింటికి ౧౫ వంతున వ్యర్థమై పోవుచున్నది ఈ బెగాశెతిన్నగా బాయిలరు ఫర్నసులకు పోవుచున్నది నీటి ఆవిరిని తయారు చేయుటకు కావలసిన వేడివంతను ఈ చెఱకు పిప్పి ఇవ్వగలదు. కాని కొన్ని సమయములలో మిల్లులు పనిచేయక, "బెగాశె" లేనప్పుడు ఫర్నసులో వాడుటకై ఎప్పుడును బొగ్గుగాని, కట్టెగాని తయారుగా నుండవలయును. ఇట్లు అట్టి సమయములలో బొగ్గుకై వెతుకుటకు ప్రారంభించిన నష్టము అధికమోయి. స్టీము (ఆవిరి వేగము) పడిపోయి ఇంజనులన్నియు ఆగిపోవుటయు, మిగిలిన పనులన్నియు ఆగిపోవుటయు తటస్థించును. బాయిలర్లు సర్వదాపనిచేయు నట్లు చూచుకొనుట అన్నిటికన్న ముఖ్యమైనది.

### తీయబడిన రసములోనుండు వివిధ పదార్థములు

క్రిందికి మిల్లులనుండియు క్రషర్సు నుండియు (Crushers) కారురసమంతయు తూములగుండాపోయి ఒకపెద్ద డబ్బా(Tank)లో పడును. ఇక్కడనుండి దానిని "లైమింగుటాంక్సు" [LimingTanks]లోకిపంపుదురు రసముకొంచెము ఆసిడు (acid) గానుండును. దానిలో ఆమ్లములు [ఆసిడు] లవణములు (సాల్ట్సు) మధురములు (గ్లూకోజు ఇన్వర్టుషుగరు (Invert Sugar), పెక్టిన్సు). జిగురుపదార్థములు రంగుపదార్థములు, నీటిలో కరగని తుక్కు, చెఱకుతో వచ్చిన మట్టివగైరా, సన్నని చెఱకు పిప్పి మొదలగు నవన్నియు నుండును. అందుచే రసము నల్లగానుండి, కొంచెము జిగురుగాను, ఆసిడుగాను ఉండును. ఇప్పుడు మనము చేయవలసిన పని సూక్రోజును తప్ప మిగిలి నలిగిన పదార్థమునంతయు తీసివేయవలయును.

### రసమును శుద్ధిచేయువిధానము

రసములో అనేకవిధములైన ఆర్గానికు, మరియు ఇనార్గానిక ఆసిడ్లుకలవు. ముందర వీటినన్నిటిని తీసివేయుటకు (అనగా న్యూట్రలైజు చేయుటకు) రసము సున్నపునీటితో లైమింగు టాంక్సులో కలుపబడుచున్నది. ఈసున్నము ఆసిడ్సులనున్యూట్రలైజుచేసి, నీటిలోకరుగని కాల్షియము సాల్ట్సులనుక్రిందకు తీసివేయుచున్నది. పిమ్మట ఈరసమును నీటిఆవిరిచే వేడిచేసినచో మరికొన్ని పదార్థములుకూడ క్రిందికి త్రోసివేయబడును. ఇట్లు ఈరసమును పెంట్రి నేడు ఫరెన్‌హీటుకు లెక్కన ౧౫ డిగ్రీలవరకు వేడిచేసి గంధకవాయువులో కలుపుదురు. కాల్షియము సల్ఫైట్ (Calcium sulphite) అనే పదార్థము పిచ్చుకలరిగి మిగిలిన అణువుల నన్నిటిని ఆకర్షించి, జిగురుపదార్థము మున్నగువాటితో క్రిందికిదిగిపోవును. నల్పును చేసినరసమును పెద్ద డబ్బాలలోకి పోనిచ్చి అక్కడ కొంతసేపు నిలువయుంచుదురు. మట్టిపదార్థమంతయు డబ్బాలఅడుగునకుచేరి నిర్మలమైనరసము పైకి తేలును. ఈనిర్మలరసమును గొట్టాలగుండాతోడి ఒకడబ్బాలోకి సంపుదురు. మలినపదార్థమునంతయు మంచి ఒత్తిడి (ప్రెషరు) తో గుడ్డలలోగుండ వడబోసి వచ్చినరసమును నిర్మల రసములోనికి గాని, చెఱకుపిప్పిని నానబెట్టుటకు మిల్లులవైదికిగాని పంపుదురు. పైనుపయోగింపబడిన వడపోయుయంత్రమును "ఫిల్టరుప్రెస్సు" (Filter Press) అందురు. గుడ్డలమన్న మడ్డియంతయు నల్లని రొట్టెముక్కలవలె పేరుకొనును. దీనిలోకూడ కొంతసూక్రోజు నష్టమగుచున్నది. ఈ మడ్డిలో మొక్కకు కావలసిన ఫాస్ఫేటులువగైరా లుండుటచే పైరు ఎరువుగా నుపయోగించవచ్చును. లేక దానిని చెఱకుచెత్త, ఆకులు, పిప్పి మొదలగువానితో కలిపి పశువుల మేతకై ఉపయోగించవచ్చును.

నిర్మలరసము (Clarified Juice) మొదట తీయబడిన చెరకురసమువలె నల్లగానుండక, కొంచెము ఎర్రగాను పచ్చగాను బంగారపు రంగును బోలియుండును. దీనిని నీటిఆవిరిసహాయమున పాకముబట్టిన సిరపు(Syrup)క్రింద తయారుచేయుదురు. ఈపని కుపయోగించువాటిని "ఎఫెక్ట్సు" (Effects) అందురు. సిరపును మరల వలయునన్నచో గంధకవాయువుతో శుద్ధిచేయవచ్చును.

రెండవపేజి చూడుడు

## పంచదార పరిశ్రమ

మొదటిపేజి తరువాయి

### పాకును చక్కెరగా ఎండించు విధము

ఈపాకునంతను డబాలలో [Tanks] నిలువ యుంచుకొని కొద్దికొద్దిగా [పెనముల] [Pans[ లోకి పంపుదురు పాన్సులో నీటి ఆవిరితో ఈపాకును వడగనిత్తురు వాక్యూము [Vaccum] సహాయమువలన ఫారన్‌హీటు థర్మామీటరులో ౧౬౦ డిగ్రీలకన్న ఎక్కువ ఉండకుండ వేడిని చ చుకొనవలయును వాక్యూము ౨౬-౨౮ అంగుళములుండును. పెంపుచేయు ఫారన్హీటు ౧౬౦ డిగ్రీలకన్న ఎక్కువ ఉన్నచో మాడి పంచదార నల్లగ తయారగును పాకు గంట గంటన్నర మరుగనిచ్చిన, అందులో కొన్ని నలుసులవంటి స్ఫటికములు [క్రిష్టల్సు] పుట్టును వీటిని మెల్లమెల్లగాను సమముగాను పాకుతో పెరుగనిచ్చినచో, పాకుతోను స్ఫటికాలతోను కూడుకొనిన గట్టియైన ముద్దక్రింద తయారగును "దీనిని మాసకిటు" [Massacuite] అందురు పెనమంతయు పూర్తిగా ఈమాసకిటుతో నిండిన పెనకదానిని క్రిందనున్న "క్రిష్టలైజర్ల" Crystallizers] లోనికి దింపి బాగా గాలితగులునట్లును, అంతా కలియునట్లును తెడ్లతో ఎల్లప్పుడు కలయను అట్లుచేసినచో స్ఫటికములు ఇంకకొంత పెరుగును దీనిని ఇప్పుడు "సెంట్రిఫ్యూగలు మెషిన్ల" లోకి [Sentrifugal Machines] తీసి మంచి స్పీడుమీద తిరుగనిచ్చినచో, లోపలి జల్లెడలో మంచి ద్రవపదార్థము "మొలేససు" [Molasses] పోయి చక్కెరలో జిగ్గాడ కంటుకొనియుండును దీనిని నీటితో కడుగవలయును అటుపైని ఇంకపైరంగు పోకడానికి పంచదారకిచ్చుటకై నీలిరంగు నీటితో కడిగి నీటిఆవిరితో కొంత ఎండనిత్తురు దానితరువాత పంచదారను వేడిగాలిలో ఆరనిచ్చి, గావలసిన సైజుకు మరలో విసిరి, బస్తాలోకి ఎక్కించుదురు

కార్పొరేషను ఫ్యాక్టరీలో సల్ఫరుడైఆక్సైడుకుబదులు కార్బనుడై ఆక్సైడు నుపయోగింతురు కార్పొరేషను ఫ్యాక్టరీలో సల్ఫేషను ఫ్యాక్టరీకన్న సున్నము పదిరెట్లు కావలయును మట్టికూడ చాలదట్టముగా బయలువెడలును కాని ఈమడ్డి దట్టముగా నుండుటచే మలినపదార్థము మరింత ఎక్కువగా తీసివేయబడి, రసము, పాకు (సిరపు) మొదలగునవి పల్చనిరంగుగలవై తెల్లని పంచదారనిచ్చుచున్నవి. అంతేగాక ఖర్చులుకొంచెము ఎక్కువైనప్పటికిని వాటినితోసి రాజటపు పంచదార ఎక్కువదిగుచున్నది

ఇట్లు పంచదార రెండుమూడు రకములుగా దిగుచున్నది మొదటిరకము తెల్లగా నుండును రెండవది కొంచెము ఎర్రగానుండును మూడవది బెల్లమునకన్న కొంచెము నయము స్ఫటికములుకూడ ఏసైజుకు కావలసిన ఆసైజుకు తీసుకొనిరావచ్చును ప్రస్తుతము చాలమందికి పెద్దపెద్ద స్ఫటికములు రుచించుచున్నవి ఈ పంచదారనే నాగరికులు యెక్కువగా వాడుచున్నారు క్యూబ్సుగాను, గ్లోబ్సు మొదలగు రూపములలోను తయారుచేసి ఎక్కువగా నాగరికులు వాడుచున్నారు ఈ పంచదారను పాకముపట్టి మరలస్ఫటికములనుచేసినగాని పటికబెల్లము (కలకండ) తయారుకాదు మొదటిరకము పంచదారను వైటుషుగరనియు, కొంచెము రంగుగానుండుదానిని రాషుగరనియు వాడుదురు ఈరాషుగరును పాకముపట్టి ఎస్సెన్సు, రంగుకలిపి కన్ఫెక్షనరీలలో (Confectionaries) పిప్పరిమెంట్లు తయారుచేయుచున్నారు

### మొలేసను

బయటకు పోవు మొలేసనులో నాటికి ౩౦ మొదలు ౩౫ పాళ్లవరకు సూక్రోజు నష్టమగుచున్నది ఈమొలేససుధరపడిపోయినది దీనిని ఉపయోగించువిధానములు తెలియక చాల నష్టముకలుగుచున్నది దీనిని సాధ్యమైనంతవరకు డిష్టిలరీసులకు అమ్ముటయో, బెగాసెతో కలిపి పశువులమేతకై ఉపయోగించుటయో, పైరుఎరువుక్రిందవాడుటయో, బెగాసెతో కలిపి బాయిలరుఫర్నేసులో వంటచెరుకుక్రిందవాడుటయో, చేయవచ్చును కాని వీటిలో ఏదిలాభకరమో నిర్ణయించుట దుర్లభముగానున్నది. ఈమొలేససుయొక్క విడుదలసమస్య ప్రస్తుతము శాస్త్రవేత్తలను పరిశోధకులను అనేకమంది సాక్షించినది

## కాంగ్రెసు కార్యకారిణీ సంఘ సమావేశము

— - 0——

కాంగ్రెసు కార్యకారిణీసంఘ సమావేశము మొన్న జూను ౨౯ వ తేదినాడు మధ్యాహ్నము ౩ గంటలకు వార్ధాగంజిలో ప్రారంభమయ్యెను ఆరోజు రాత్రి ౭ గంటలు కొట్టగానే ఆపబడెను సభా ప్రారంభదినమునకు ౪ రోజులకు ముందునుండియే సభ్యులందరును రాసాగిరి అధ్యక్షులగు జవహర్లాలుగారు జూను ౨౯ వ తేది ఉదయం ౧౧౪ గం॥ల బండిలో జయప్రకాశనారాయణగారితో కలిసివచ్చిరి స్టేషన్ దిగగానే నేరుగా గాంధిమహాత్మునివద్దకువెళ్లిరి కాని మహాత్ముడు మౌనములో నుండుటచే ధారాళముగా సంభాషించుటకు వీలులేదయ్యెను ౦నుక సాయంకాలము ౭ గంటలకు సభ చాలించబడినబడినపిమ్మట మరలమహాత్మునివద్దకు పోయి చాలసేపు సంభాషించిరి

జూను ౨౯ వ తేది నాటి సమావేశములో డాక్టరు అన్సారిగారియొక్కయు అబ్బాసు త్యాబ్జీగారియొక్కయు మరణములకై విషాదములదెలుపు రెండుతీర్మానములామోదించబడిన బడినతర్వాత బెంగాలురాష్ట్రములో కాంగ్రెసువారలలో పుట్టినవివాదమును పరిష్కరించు మూడవతీర్మానము నామోదించిరి వివరము పూర్వము జరిగిన కాంగ్రెసు సంఘముల ఎన్నికలు సక్రమముగావను ఆక్షేపణపై ఉదయించినట్టిది, పరిష్కారములో క్రొత్తఎన్నికలకై బెంగాలురాష్ట్ర కాంగ్రెసుసంఘమునూచించినఏర్పాట్లు ఆమోదించబడెను, తర్వాత నాల్గవతీర్మానముచే ఇక ఎక్కడ కాంగ్రెసుసంఘముల ఎన్నికలసంబంధించిన వివాదములు వచ్చినను బాబు రాజేంద్రప్రసాదుగారికి అధికారమీయబడెను కాంగ్రెసుసభ్యుల సభ్యత్వము అంతమొందుటకు సంబంధించిన విషయములను మరికొన్నింటిని లక్నో కాంగ్రెసు మహాసభ తీర్మానముల ననుసరించి చేసినతర్వాత (౫ మరియు ౬ వ తీర్మానములలో) సభ నాటికి చాలించబడెను

మరునాడు ఉదయము ౮ గంటలనుండి ౧౬ గంటలవరకు సభ జరిగెను సామ్యవాద ప్రచారము చేయుచు జవహర్లాలుగారు చేసిన ఉపన్యాసములనుగూర్చి చర్చ జరిగినట్లుండెను కాని కార్యదర్శులు చెప్పదగిన విషయములేదియు లేవని పత్రికల విలేఖకులకు చెప్పిరి బజాజుగారు ప్రత్యేకముగ మహాత్మునితో సంభాషించిరి ఉదయము ౧౧ గంటలకు కాంగ్రెసు సభముగియగానే సర్దారు వల్లభాయిపటేలు, బూలాభాయిదేశాయి సి రాజగోపాలాచారిగార్లు మగన్వాడికిపోయి గాంధిమహాత్మునితో సంభాషించుచుండి సాయంకాలము ౭ గంటలకు తిరిగి సభాస్థలము చేరుకొనిరి అందుచే మధ్యాహ్నము ౨౪ గంటలకు కార్యకారిణీ సంఘ సభ జరుగలేదు రాత్రి ౭ గంటలనుండి సభ జరిగెను

జులై ౧ వ తేది ఉదయం ౮ గంటలకు మరల సభవారు కూడి ఆలోచించిరి. సాయంకాలము ౫ గంటలతో ఈవార్ధాగంజి సమావేశము ముగిసెను మరల సభ బొంబాయిలో ఆగస్టు ౧౫ వ తేదినాడు జరుగునట్లు అనుకొనబడెను

కాంగ్రెసు కార్యాలయవ్యయములకై ౧౬ వేల రూపాయలను కార్యకారిణీ సంఘమువారు మంజూరుచేసినట్లును, పాలెస్టీనులో అరబ్బులు బ్రిటిషు సామ్రాజ్యతత్వమును ప్రతిఘటించుచు స్వరాజ్యమునకై చేయు యత్నములో సానుభూతిని తెలుపు తీర్మానము ఆమోదించబడినట్లును తెలియుచున్నది కాంగ్రెసుకు జనసామాన్యముతో సంబంధమును ఎక్కువజేయు మార్గములను రాష్ట్రీయకాంగ్రెసు సంఘములు సూచించుటకై కోరబడియుండెనుగదా ఆసూచనలను కేంద్రకాంగ్రెసు కార్యాలయమునకు పంపుటకు ౩౧ ఆగస్టు వరకు గడువీయబడెను బెంగాలురాష్ట్రములో కాంగ్రెసు సభల ఎన్నికల సందర్భమున వచ్చువివాదముల నన్నింటిని పరిష్కరించుటకు బాబు రాజేంద్రప్రసాదుగారికి అధికారమీయబడెను.

కడపటిరోజు జరిగిన విషయములలో ముఖ్యమైనదేమన, కాంగ్రెసున్ను మాలవ్యాగారి నేషనలిస్టుపక్షమున్ను రాబోవు ఎన్నికలలో కలిసి సహకారముగా పనిచేయువిషయమై తనకును మాలవ్యాగారికిని జరిగిన ఉత్తరప్రత్యుత్తరములను జవహర్లాలుగారు సభలో చదివిరి సాంఘిక పరిష్కారము (కమ్యూనల్ అవార్డు అనునది) ను గూర్చిన అభిప్రాయమును జూను ౨౮ మరియు ౨౯వ తేదులలో గావించిన టనలలో జవహర్లాలుగారు స్పష్టము న్నారు ఎన్నికలలో కాంగ్రెసు న్నుకొనుటకు వోటర్లను కోరుటకై విజ్ఞప్తిని ఒకపత్రరూపమున కాం కారిణీసంఘమువారు త్వరలో ప్రకట ఆపత్రములో సాంఘికసమస్యనుగూర్చి గ్రెసువారి అభిప్రాయము స్పష్టముగా బడునని కార్యదర్శిగారు రాత్రి ౮ గంటల పత్రికల విలేఖకులకు గావించిన ప్రకటనలో తెలిపిరి.

ఇందుమూలమున సర్వజనులకు తెలియజేయున దేమనగా

మేముమిగులశ్రద్ధతో సాగ్ సుందర్ (Curry Powder) అను ఒకచూర్ణము (Powder) తయారు చేసియున్నాము. ఈచూర్ణము మిగులసువాసనగలిగి మిక్కిలి అందముగానుండును. దీని ఉపయోగమువలన అన్ని శాకములు మిగుల రుచికారిఅయ్యి మిక్కిలి సువాసనఇచ్చును శాఖములలో నెయ్యి,నూనె, ఉల్లిగడ్డతప్ప ఉప్పు, మిరియము మసాలలు (సువాసనద్రవ్యములు) ఇకఏవిధమైన వస్తువులను వేయనక్కరలేదు. వీటియన్నిటికిబదులు ఈచూర్ణము ఉపయోగించవలయును. దీనివలన శాఖములు, పచ్చళ్లు, చారు ఇత్యాదివన్నియు మిక్కిలి రుచిగా, మనోహరముగా కాగలవు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| దీనివెల—ఒకపౌండ్ (అర్ధశేరు) | డబ్బ | రు. | ౦ | ౧౦ | |
| ,, (పావు ,,) | ,, | | ౦. | ౫ | పై. ౪ |
| ,, (అర్ధపావు) | ,, | | ౦. | ౨ | పై. ౮ |

ఇట్లు

జగ్ మోహన్ స్టోర్స్

షాహరాహ ఉస్మాని, తార్ఆఫీసుఎదుట, హైద్రాబాదు దక్కన్.

అమూల్యము అపూర్వమైన గ్రంథరత్నము

ఆలస్య మొనర్చిన ఆశాభంగము

త్రివర్ణ పార్వతీ పరమేశ్వర చిత్రపట సమేతము

శ్రీ శివభక్త విజయము

పండిత పామరుల రంజింపజేయగలదు. ౨౦-౩౦ శివభక్తుల అద్భుత చరిత్రలు చదువునప్పుడు తప్పనిసరిగా విషాదవిభ్రమాశ్చర్యములు కలుగును. ౫౦౦ పుటలకుపైగా సగంక్యాలికో గిల్టుబైండు వెల రు ౧-౮-౦ పోస్టుఖర్చు సహా

పంచాక్షరీ ప్రింటింగ్ వర్క్సు

మహారాజ్ గంజు, హైద్రాబాదు

ఆర్. ఆర్. గోపాల్

జనరల్ క్లాత్ మర్చంటు

జూబిలి మొదటి బహుమానము

క్రొత్తటూరింగు మోటారు కారును

మరియు ౧౦౦ బహుమానములు

బహుమానములు యివ్వబడును.

ముందుకు ప్రభువుగారి సిల్వర్ జూబిలి టిక్కెట్లు లాభముపొందుడు. మా వద్ద 5-0-0రుబట్టలు కొనువారికి ఒకప్రైజు టిక్కెటుయివ్వబడును. జిల్లాలవారు వి. పి ద్వారా తెప్పించుకొని టిక్కెటులాభముపొందవచ్చును.

బ్రాంచి — ఆబిద్ రోడ్ — టెలిఫోన్ నెం 751

సదరు దుకాణము — పత్తర్ గట్టి — టెలిఫోన్ నెం॥ 576

కుటుంబసంరక్షణి

ప్రతియింట వుండదగినది. (Price Rs 1-0-0 Posting extra) ఇందు త్రిదోషహరములగుమాదుండిన్యౌషధ రాజములగలవు. పెద్దవారికినిపసిపిల్లలకునుచాల అవసరము. ఒక్క తూరివాడినమీకే తెలియును

S.P.R SATRY & SONS. 6464. PANDITHASRAMA SECUNDERABAD. DN

# జిల్లాలు

## మద్యపాన నిరసనోద్యమము

(ఒక ఆంధ్రుడు)

మహాఘనత వహించిన మన ప్రభుత్వమువారి రాష్ట్రమున వ్యాపించియున్న త్రాగుబోతుతనము దేశీయులకు సర్వవిధముల నష్టదాయకమని గ్రహించినవారై, దీనివాపుట ముఖ్యమనియెంచి, ఈవిషయమున సూచనల జేయుటకై, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తియగు నవాబు మిర్జాయార్జంగు బహదరుగారి నాయకత్వమున నొకకమిటీ స్థాపించియుండిరి కమిటీవారీవిషయమున విచారించి, కొన్ని సూచనలు ముఘన నిజాముప్రభువుగారి కడకు ప్రభుత్వ సభ (బాబెహుకూమతు) ద్వారా తమసూచనలను పంపుకొనినమీదట శ్రీప్రభువుగారు ౧౩౪౦ జాను ౧౩౪౮ హిజ్రి (౧౮ డిసంబరు ౧౯౩౫) నాడు మద్యపాన నిరసనోద్యమమును గురించి యొకఫర్మాను జారీచేసిరి,

ఈఫర్మానుయొక్కయు అందులో ప్రతిపాదింపబడిన నియమముల యొక్కయు సారాంశమేమనగా —మూడు సంవత్సరములకొరకు ప్రస్తుతము నవాబు మిర్జాయార్జంగు బహదరుగారి యధ్యక్షతతో నొకకమిటీ స్థాపింపబడినది. కమిటీవారు ఈవిషయమైన ఆందోళనము చేయుటకుగాను వారిసహాయార్థము సంవత్సరమునకు అయిదువేల రూపాయల చొప్పున ద్రవ్యమంగీకరింపబడినది ఈ యుత్సవము నిర్వహించునట్టి కేంద్రసంఘముయొక్క సభాసదులను ప్రభుత్వమువారు నియమింతురు కమిటీ యధ్యక్షుడు మాల్గుజారీ మొతెమదుగారి ఆంగీకారము పొంది, ఏదేని ప్రత్యేక కార్యమున ...ల్యులలో ఒకరినిగాని ఇద్దరినిగాని ...ను ఈ కేంద్రసంఘము యొ...గాని ప్రభుత్వమువారు జిల్లా ...రసన సంఘముల్లను మూడు ...ములకొరకు నిర్ణయించవచ్చు ...ము యొక్కయు జిల్లాసంఘము కార్యదర్శులకు భృత్యులకు ...బడును ఇవికాక వీరిసేవలను ...చయు ఇతర పాలనావిధానమున గురించి ...యు నియమములు ఏర్పరుపబడినవి

తరువాత నీ కేంద్రసంఘమునకు ఈ క్రింది ...ధికారము యుండునని (౧౨)వ నియమము ... వివరింపబడినవి ప్రభువుగారి ఫర్మానులోని ...దేశ్యము నెరవేర్చుటకై మాల్గుజారీ శా... వా... నాలోచించి అవసరమగు వ్యవహార ... జ...టు, లేక ఆలోచన చెప్పుట! ఉదాహరణార్థము, పాఠశాలలలో బాలురకు బాలికలకు చెప్పు పుస్తకములలో మత్తుపదార్థముల వాడుటవలన కలుగు నష్టములను బోధించు పాఠములు చేర్పించుట, మద్యపాననిరసనమును గూర్చి లఘుపుస్తకములు కరపత్రములు వ్రాయించి పంచిపెట్టుట కల్లుసారా దుకాణములకుపర్వానా (లైసెన్సు) యిచ్చుటనుగురించిగాని అట్టిలైసెన్సుల సంఖ్యను గురించిగాని ప్రభుత్వమువారికి సూచించుట, లేక చిత్తునియమముల సిద్ధపరచి పంపుట సారాయిత్రాగు అలవాటును మరపించుటకై ...నీటినిచ్చు శాలల [చాయఖానాల]ను స్థాపించుట, ఒళ్లలో గ్రంథాలయముల తెలకొల్పుట సారాయిత్రాగుట తగ్గించుకొని ధనము నిలువచేసికొనిన వారిని ద్రవ్యమిచ్చి ప్రోత్సహించుట

ఇవికాక తగిన విశ్వాసపాత్రులగు ఏజంట్లనుఏర్పరచి వారితో ఆబ్కారీ హోదేదారులకు సహాయముచేయించి సారాయి దొంగతనముగా సిద్ధము చేయు బట్టీలను పట్టుకొనుటను ప్రోత్సహించుట దీనివలన సారాఅమ్మెదుకాణముల సంఖ్య తక్కువఅగుటయును దొంగతనము సారాసిద్ధముచేయువారు జనులను తమవైపు ఆకర్షించుకొనుటకు వీలులేకపోవుటయును జరుగగలదు ప్రభుత్వమువారికి చిక్కులు తగ్గిపోగలవు

ఇదిగాక ఇతరవిధమున, మద్యపానదురభ్యాసము తగ్గించువిషయమున ప్రభుత్వమువారికి ఆలోచనలు చెప్పుట, సూచనలు చేయుట

ఈపని ౧౩౪౫ ఫసలీనుండి ఆరంభమగుచున్నది, ఇప్పుడు అయిదువేలరూపాయలు ఇచ్చుచున్నారు ముందుసంవత్సరములలో ఈమొత్తము అవసరమునుబట్టి హెచ్చించవీలుకలదు కమిటీవారుచేయు కార్యవిధానము తప్పుదారి తొక్కినచో ఈసహాయద్రవ్యము ఆపివేయబడగలదు

ఈవిషయమున కేంద్రసంఘముయొక్క సభాసదులు జనులనుండి వారి యిష్టానుసారము మద్యపాననిరసనోద్యమమునకై చందాలు జరుచేయవచ్చును ఇట్టిద్రవ్యము జిల్లా కమిటీవారు వసూలుచేసినట్ల ఆజిల్లా కొరకు ప్రత్యేకింపబడును

ఇక వైరూపాయలకంటెమించిన ధనవ్యయము చెక్కుద్వారా చేయబడును

నియమావళియొక్క సారాంశమిది ప్రభుత్వమువారి యుద్దేశము చాల ప్రశంసనీయము ఈ యుద్యమమునకు ముఖ్యముగా అర్హమైనది తెలంగాణా ప్రాంతము అనగా నిజాము రాష్ట్రములోని ఆంధ్రజిల్లాలు ఏలయనగా, తెలంగాణాలో, త్రాగుబోతుతనము ఎక్కువఅనియు, ఈతచెట్లు తాడిచెట్లు విస్తారముగా నుండుట ఆందుకు కారణమనియు అందరికి తెలిసిన విషయమే

ఈకారణమునబట్టియే, మనరాష్ట్రములోని ఆంధ్రోద్యమము ఆరంభమైన నాటినుండియు జిల్లాలలోను గ్రామములలో ఎన్నియో సభలలో సీదురభ్యాసము ఖండింపబడినది ప్రతిఆంధ్ర మహాసభయందును ఉపన్యాసకులు ఈవిషయమునుగూర్చి మనస్సున కెక్కునట్లు ఉపన్యసించుచున్నారు అట్టివారిలో శ్రీయుతులు శ్యామారావు ఆరిగెరామస్వామిగార్లు నైపుణ్యము సంపాదించియున్నారు ఆంధ్రమహాసభాస్థాయిసంఘ ప్రచారకుడు జిల్లాలలో చేయుచున్న ప్రచారము నిదికుఖ్యాతిముఖ్య విషయము ప్రథమాంధ్ర మహాసభ [జోగిపేట]కు అధ్యక్షులుగానుండిన శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారు "మద్యపానము"నుగూర్చిన లఘుపుస్తకమును వ్రాసిరి దీనిప్రతులు ఆంధ్రజనకేంద్రసంఘమువారి వలన మరల కొలది విక్రయింపబడినవి నిజాంరాష్ట్రములోని ఆంధ్రోద్యమము ఈవిషయమున చాల సేవచేసియున్నది కనుక వారు ప్రభుత్వమువారితో సీవిషయమున పత్రవ్యవహారము జరిపి, ప్రభుత్వముతో సహకారమొనర్చుట అత్యుత్తమము లాభప్రదముఅని చెప్పుట కాటంకము లేదు గ్రంథాలయ స్థాపనముకూడ ఆంధ్రోద్యమము యొక్కముఖ్యాంగము కనుక ప్రభుత్వమువారు ఆంధ్రోద్యమముతో చేతులుకలిపి పని చేయదగును

## సికింద్రాబాదులో నీటి పన్నుల భారము ఘోష

సికింద్రాబాదులో నీటిపన్నులు చాల అధికమైనందున, ప్రజలకు కావలసిన తనీరు వాడుకొనుటకు భయపడుచున్నారు వాడుకొనిన డబ్బు అధికముగా యీయవలసియుండును వాడుకొననిచో ఆరోగ్యమునకు భంగముకలుగును కిరాయదార్లకు యింటి యజమానులకు కలహములు సంభవించుచున్నవి ఇదివరకు ఎంతనీరు తీసుకున్న అంతపైకము చెల్లింపవలసియుండెను ఇప్పుడు యలక్ట్రిక్ దీపములకువున్నటుల మినిమెంచార్జి నియమించియున్నారు ఇంటినిబట్టి ౨౫౦౦ గ్యాలనులు ౫౦౦౦ గ్యాలలు యింకా యేమేమోయని నిర్ణయించియున్నారు అంతకు అధికముగా తీసుకొన్న అధికముపైకము చెల్లించవలెను ఇదివరకు ౧౦౦౦ గ్యాలనులకు ౭ అణాలుండెను, ఇప్పుడు ౧౦౦౦ గ్యాలనులకు ౧౦ అణాలు, మీటరుబాడుగ ౧౦ అణాలు ఇదివరకు బిల్లులపైకము వారే వసూలుచేయుచుండిరి యిప్పుడు ప్రజలు ఆఫీసుకువెళ్లి డబ్బుకట్టవలసియున్నది వేసేల ప్రజలకు నీటిపన్ను మోయనిభారమైనది ప్రజాప్రతినిధులు నీటిపన్ను భారమునుండి ప్రజలను విముక్తిజేసెదరని నమ్ముచున్నాము

— ఒక విలేఖరి

# సమాచారములు

## మోటారు తలక్రిందులగుట

గుల్బర్గ ౨౮ అమర్దాదు

౨౮ అమర్దాదు నాడు పగలు ౧౨ గంటలకు షోరాపురమునుండి వచ్చు కన్లిమోటరు, యాదగిరి సమీపమున భీమానదివంతెన దాటి నతర్వాత దిబ్బలలో తలక్రిందులైనది రాజమార్గము ప్రక్కనున్న ఇనుప కడ్డీలుకూడా విరిగిపోయెను మోటారు నడిపించువాడు మోటారు తుడుచువాడు వెంటనేచనిపోయిరి ఇంకా ఇద్దరుముగ్గురికి తీవ్రగాయములు తగిలినవి

## తుపాకి మందు చేయువార్పై పురజనుల ఆక్షేపణ

బీదరు ౨౮ అమర్దాదు

నారాయణ ఖేడలో కొందరు తుపాకిమందు చేయుచుండిరి ఊరిలో తయారుచేయుచుండుటవల్ల తమకు ప్రమాదము కలుగవచ్చునని పురజనులు రక్షకశాఖవారికి తెలుపగా, విచారణసల్పి రక్షకశాఖవారు ఇద్దరిని పట్టుకొని న్యాయస్థానమున కప్పగించిరి

## నైజాంరైల్వే అధికారులకు సేడంపౌరుల మొఱ

సేడం ౨౮ అమర్దాదు

సేడం గుల్బర్గా జిల్లాలో చేరినది ఇక్కడి రబ్బిపైరులు పండుచున్నవి ప్రతిఏట వానకాలమున గత్తర వచ్చుచుండును ఇక్కడి రైల్వేస్టేషనుపై, రైలు రెండు నిమిషములు మాత్రమే ఆగుటవలన ప్రయాణీకులకు ఇబ్బంది కలుగుచున్నదనియు, మొన్న నే ఓ ప్రయాణీకుడు, జబ్బుపడిన భార్యను రైలులో నెక్కించజాలకలోయెవరియు ఇక్కడనెకనీసము ఐదునిముషము ల ఆపుట ధర్మమనియు రైల్వే అధికారులకు స్థానికులు మొరపెట్టుకొనినారని తెలియుచున్నది

## శ్రీ హనుమదాంధ్ర భాషానిలయ స్థాపన

మాలకలపల్లి

[పాల్వంచ సంస్థానము]

ఈ ఆషాఢశుద్ధ సప్తమి శుక్రవారంరోజున బూర్గుపాడు గ్రంథాలయాధ్యక్షులును, భూస్వాములునగు చంద్రా క్రిష్టయ్య చౌదరిగారి యధ్యక్షతనపై గ్రంథాలయ ప్రారంభోత్సవము జరుపబడినది ఈగ్రంథాలయ కార్యక్రమమును నిర్వర్తించుటకు మాదిరాజు వెంకటేశ్వరరావు [పతేదారు]గారు అధ్యక్షులుగను, మరా శ్రీ శనగపాటి పేరుస్వామి ఉపాధ్యక్షులు మరియు కోశాధ్యక్షులుగను పువ్వాడ నారాయణగారు కార్యదర్శిగను రామకోటిగారు సహాయ కార్యదర్శిగను మిరియాల వీరయ్యమరియు పాములకొర్ర బసవయ్యగార్లు సభ్యులుగ ఎన్నుకొనబడిరి గ్రంథాలయమునకు శ్రీ మాదిరాజు వెంకటేశ్వరరావుగారు గోలకొండ పత్రికను రు ౨౦/ల గ్రంథములను, శ్రీ శనగపాటి పేరుస్వామిగారు ఆంధ్ర వారపత్రికను ౫౦ గ్రంథములను, శ్రీ పువ్వాల నారాయణ మరియు వీరయ్యగార్లు కృష్ణా పత్రికను, నారాయణగారు ౫౦ గ్రంథములను బసవయ్యగారు రు ౪-౧-౦ లు విరాళమును శ్రీరంగారావు మరియు జానికి రామారావు మరియు క్రిష్ణయ్యగార్లు బీరువారలను యిచ్చెదమని వాగ్దానము లుచేసిరి శ్రీరాముల లక్ష్మినారాయణగారు వినోదిని, శ్రీమల్లాది రామయ్యగారు "నవ్వులరాణి" తెప్పించియిచ్చెదమనిరి పత్రికలకు గ్రంథములకు కొంతసామగ్రి సమకూడినది ఇటుల గ్రామస్థులు అభిమానము జూపి మా ప్రయత్నముల ప్రోత్సహించినందులకు కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము మా యీయారంభప్రయత్నములకు దేశీయులును బూర్గుంపాడు గ్రంథాలయమువారును తోడ్పడి ... సంగి ఈ గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడ ... ఈ గ్రంథాలయమును పోషించ... దీనికి సహాయము సమకూ... కడి ... చెవకుగాక



బూర్గ... పాఠ్య) పువ్వాల నారాయణ ... కార్యదర్శి

## మానవిలో హంపి విరూపాక్షస్వామి చాతుర్మాస్యము

జగద్గురు శంకరాచార్య హంపి విరూపాక్ష స్వాములవారు మానవిలో చాతుర్మాస్యదీక్ష ప్రారంభించియున్నారు ప్రతిదినం సంపాపతిపురాణం జరుగుచున్నది


## చిరకాలము క్రిందస్థాపింపబడిన హోమియోపతులు

మంచిగుణమిచ్చు, నమ్మకమగు, శ్రేష్ఠమైనహోమియోపతిక్ మరియు బయోకెమిక్ మందులకొరకును, ఆవిషయములకుసంబంధించిన లిటరేచరుకును మాకు వ్రాయుడు- చాలకాలముక్రిందటనె మాసంస్థ ఇట్టిమందులకు నమ్మకమైన గృహముగా అంగీకరించబడినది- సరళమైనధరలు, శ్రేష్ఠమైనసరకు సరఫరా, తృప్తికరమగుసేవ- ఒకపర్యాయమువాడిచూచిన, చిరకాలము క్రిందటనే మమ్మెలనెరుగనందులకు విచారించెదరు- 1889లో స్థాపించబడినది-

ఖరీదులజాబితాయు,లిటరేచర్ దరఖాస్తుపంపినచో ఉచితము గాపంపబడును

రాయ్ అండ్ కంపెనీ, హోమియోపతిక్ కెమిస్టులు,డ్రగ్గిస్టులు, బొంబాయిపిర్స్పెషువీధి, ౨

## తెలుగువాండ్రబళ్లలో హిందీనిర్బంధము ఉండరాదు

మదరాసు ప్రభుత్వము వారిఆజ్ఞ

మద్రాసు రాష్ట్రములో పశ్చిమగోదావరీ జిల్లాలోని నరసాపురం తాలూకాలో చేరిన పాలకొల్లులో పురపాలకసంఘమువారు (మునిసిపాలిటీ) తమ ఉన్నతపాఠశాలలో హిందీభాషను నిర్బంధముగ నేర్పుటకు ఏర్పాటుచేయదలచి, మదరాసుప్రభుత్వమువారి అభిప్రాయమును కోరిరి. అందుపై మదరాసు ప్రభుత్వమువారు ఈక్రింది ఉత్తరువును జారీచేసినారు:-

"పాలకొల్లు పురపాలకసంఘమువారుతమ ఉన్నతపాఠశాలలో ౧వ, మరియు రెండవ, మరియు మూడవ ఫారములలో హిందీభాషను నిర్బంధముగ నేర్పదలచినారు. ఇదిప్రభుత్వమువారు అంగీకరింపజాలరు. ఈదిగువ నియమముల ప్రకారము హిందీని నిర్బంధము లేకుండ కోవలసినవారలకు మాత్రము నేర్పువిషయములో ప్రభుత్వమువారికి ఆక్షేపణము లేదు.

౧ హిందీతరగతులకు విద్యార్థులు వారియిష్టముపై రావలెనేగాని, అట్లురావలెనని వారిని నిర్బంధము చేయరాదు.

౨ విద్యార్థియొక్క స్వభాషకుగాని, చదువవలసినట్లు నిర్ణయించబడియున్న ఇతరవిషయములకుగాని, సంస్కృతముండు బళ్లలో సంస్కృతమునకుగాని భంగము రాకుండ హిందీనేర్పవచ్చును. విద్యార్థులతండ్రి లేక పోషణకర్తయొక్క లిఖితరూపమగు అనుమతిలేనిది యితరభాషను నేర్చుచున్న విద్యార్థిని హిందీతరగతికి మార్చరాదు.

౩ హిందీనేర్పుటకు అధికముగ ధనముఖర్చుచేయుటకు పూర్వము పాఠశాల కవసరమగు యిండ్లవసతి, ఆరోగ్యపరిస్థితులు, వ్యాయామశిక్షణావకాశములు సక్రమముగ నున్నవో లేవో గాచుకొని వాటికై వ్యయమును ప్రధానముగ చేవలెను.

## స్కాలర్షిప్పులనుకోరు రెడ్డివిద్యార్థులకు

మద్రాసు రెడ్డిజనసంఘమువారు కళాశాలలలోను, సాంకేతిక విద్యనేర్పు బళ్లలోను చదువుచుండు రెడ్డికులస్థులగు అర్హతగల బీదవిద్యార్థులకు నెల ౧కి రూ ౧౫లు, రూ ౧౦లు రూ ౫ లు విలువగల స్కాలర్షిప్పులను ఇవ్వగలరు, లాకాలేజీలలోగాని, యల్. టి. తరగతులలోగాని చదువు ఎవరికీగాని స్కాలర్షిప్పులీయబడవు. ఉన్నత పాఠశాలలలో చదువు విద్యార్థులవిషయమున, స్త్రీలువారి తమే దరఖాస్తులు పంపుకొనవలెను కొన్ని స్కాలర్షిప్పులు చిత్తూరుజిల్లా హైస్కూలులో ౪వ, ౫వ, ౬వ ఫారములలో చదువుచుండు బ్రాహ్మణేతరకులములకు చెందిన బాలురకును ఇవ్వబడగలవు.

గతసంవత్సరము స్కాలర్షిప్పులను పొందుచుండినవారలు మరల క్రొత్తగా మంజూరుచేయించుకొనుటకు క్రొత్తగా దరఖాస్తులు పెట్టుకొనవలెను దరఖాస్తుఫారములు కడపలో రెడ్డిజన సంఘకార్యదర్శియగు కె. కోటిరెడ్డిగారి వద్ద దొరకును. దరఖాస్తులను కార్యదర్శికి పంపవలెను ... తేదీలోగా చేరునట్లుపంపుకొనవలెను

... భయపడకుడు. ... భయపడకుడు.

## న్యుమోనియా

డాక్టరు ... స్పెషలిస్టు న్యుమోనియా, ... అను ... సంవత్సరములు ౧౦ గం టలలో ... ౧౦. ... దగ్గర


పండిత డి. గోపాలాచార్యులవారి

జీవామృతము

బలహీనతవలన జనించు రుగ్మతలను అటంకపరచి దేహమునకు ఆరోగ్యము రక్తశుద్ధి, నరములకుపటుత్వము కండపుష్టిని, మనోబలమును తేజస్సును, జ్ఞాపకశక్తిని వృద్ధిపరచుటకు

ప్రసిద్ధిచెందిన వాజీకరరసాయనము

అన్ని మందుల షాపులలోను దొరకును

క్రమముగాను జయప్రదముగాను అభివృద్ధిచెందుచుండిన

పాపులరు యిన్సూరెన్సుకో, లిమిటెడ్

హెడ్ఆఫీసు:—మంగళూరు. ద. ఇండియా

బోనసు
31—12—34 మొదటి
వాల్యుయేషన్ లోనే 1000కి
రు 10—0—0 లు తేలినవి

పాలసీ
పాపులరులో నమానమైన
సౌఖ్యమైన నిస్సంశయమైన
పాలిసీ యింకోటిలేదు.

ప్రాస్పెక్టసు మరియు వివరములకువ్రాయుడు

హైదరాబాదురాజ్యము ఆంధ్రదేశమునకు స్పెషలు ఏజన్సీలు ఉదారమైన పద్ధతులమీద అనుభవముకలవారు కావలెను.

ది మ్యానేజింగు డైరెక్టరు

ప్రకటనరేట్లకు వ్రాయుడు

మేనేజరు
గోలకొండపత్రిక


## Notice

The public and policy-holders are requested to note hat the branch office of the Venus Assurance Company Ltd. (Delhi) Market Street has been shifted to Dady Mansions upstairs opposite the K. E. M. Hospital Secunderabad from the 1st July 36.

## ప్రకటన

పాలసీహోల్డర్లకున్ను యితరులకున్ను యిందుమూలముగా తెలియజేయునదియేమనగా వీనస్ ఎస్యూరెన్సుకంపెనీ లిమిటెడ్ (డిల్లీ) మార్కెట్టు వీధిలోనుండి యెత్తివేసి, సికింద్రాబాదు కె. యి. యం. హాస్పిటలు కెదురుగానుండు దాదిమాన్షన్సు మేడపై భాగమునందు ౧ వ జూలై ౩౬ నుండి వుంచబడినది.

M. H. Zama.
Chief Agent.


501 సబ్బు ఉపయోగించి నందువల్ల ౫ ది గంటల వరకే నాబట్టలు ఉతుకుట పూర్తిఅయినది.

501 Soap

డబ్బుకు బట్టలకు పనికి కలిసివచ్చును.

ది టాటా ఆయిలుమిల్సు కం. లిమిటెడ్. టాటాపురం అండు బొంబాయి.

యూసఫ్ బిల్డింగు షాహరాహె ఉస్మాని హైద్రాబాదు దక్కన్.


## కట లక్ష్మారెడ్డిగారు స్మృతితప్పుట

శ్రీయుతమూర్తి శ్రీవేంకట లక్ష్మారెడ్డిబారిష్టరు హైకోర్టులో ఒకజ్యూరీకేసు విచారణము గించుసమయములో అకస్మాత్తుగా స్మృతి తప్పిపడిపోయినారు. వెంటనేవారిని ఉస్మానియా వైద్యాలయములో చేర్చినారు. సుమారొక గంటకాలము స్మృతితప్పియుండిరి. ఇంజెక్షను లియ్యగా చిన్నగా స్మృతివచ్చినది. వెంటనేజ్యూరీలతో మాట్లాడినట్లు ప్రజలతో మాట్లాడినారు. ఇంగ్లాండులోనుండు తమకూతురును "... ... లీలా" అని పిలిచినారు. క్రమక్రమముగా పూర్తి స్మృతివచ్చినది. వారికి రేపటివరకుపూర్తిగా ఆరోగ్యము కలుగునని డాక్టర్లు అభిప్రాయమిచ్చినారు.




ధాత నామ సం॥ ఆషాఢ బ॥ ౫

గురువారము

## హిందీ వ్యామోహము

కొన్ని సంవత్సరములనుండి ఆంధ్రులను హిందీవ్యామోహము పట్టుకొని ఏమి ఆడించినను ఆడించుచున్నది. శాసనోల్లంఘనాస్త్రముల నన్నిటిని గాంధిమహాత్ముడు తనపొదిలో దాచిపెట్టగానే భారతస్వారాజ్యమంతయు కూడ ఆంధ్రులకు హిందీలోనే కనపడ ప్రారంభించినది హిందీదేవతోపాసనయే దేశవిముక్తిసాధనపరమమంత్రమైనది. ఆ దేవత సంతృప్తికై ఎంత ఉపహారము నిచ్చినను మంచిదేఅను వేద ఘోషలు ప్రబలినవి. హిందీభాష నేర్చుకొనుటవల్ల కలుగు లాభమునుగూర్చి గాంధిమహాత్ముని బోటి పెద్దలు చెప్పినమాటలు విద్యావంతులగుఆంధ్రులద్వారా ఆంధ్ర జనసామాన్యములోనికి దిగునప్పటికి, వాటి అర్థమే తారుమారైనది హిందీ నేర్చుకొన్ననే చాలు స్వారాజ్యము కరతలామలకము అను పిచ్చి వ్యాపించినది

మేము హిందీనేర్చుకొనుట తప్పని గాని దానివలన దేశమునకు ఏవిధమైన లాభములేదనిగాని అనుటలేదు. అదేప్రకారముహిందీ నేర్చుకొనకపోవుట తప్పనిగ్గాని, అట్లు నేర్చుకొనక పోయినందువలన ప్రతివాడును సకలవిధముల నష్టపడుననిగాని అతని దేశము నష్టపడుననిగాని మేము అంగీకరించజాలము దేశములో జాతీయత హిందీభాషా వ్యాప్తి చేతనేపోషించబడునను మాటనుకూడ మేము సత్యమని అంకగీకరించము భారతదేశములో నేటి జాతీయతాబీజము ఇంగ్లీషుభాషయై యుండుటయే ఇందుకు నిదర్శనము. మేమిప్పుడు చింతించునది ఏమన,హిందీవ్యామోహము ఆంధ్రులను కామెర్లరోగమునవలె యెంతకు పట్టకొనవలెననునదియే. ఏది ముఖ్యమో ఏది అముఖ్యమో, ఏది అత్యవసరమో ఏది రెండవ అవసరమో, ఏది సాధింపదగిన లక్ష్యమునకు సరియైనసాధనమో ఏది కాదో— కొంచెము స్వయముగ వివేచనచేసి ఎంత గొమ్ములుతిరిగినవారలు తమకు ప్రతికూలపక్షముననున్నను, తాముమాత్రము ఏ మొహమోటములేకుండ రెండవమార్గమును నిరాకరించుటకు నేర్చుకొన్నప్పుడేగాని ఆంధ్రజాతికి, ఆకారణమున ఏజాతికైనను, బాగుపడు ఆశ లేదు.

ఆంధ్రులు ఇట్టివివేచన లేక గ్రుడ్డిగా హిందీని ఏదో గొప్పదేవతనవలె ఆరాధించు పిచ్చికి దాసులగుటవలన కొన్ని నష్టములు సంభవించిన సందర్భములును గలవు. బళ్లలో చదువుకొను విద్యార్థులకు వారల పరీక్షావసరములకును, వారల శరీరవ్యాయామావసరములకును, వినియోగించుకొనుటకే తీరిక యుండనప్పుడుకూడ ఉత్త వ్యామోహముచే హిందీకై కాలము వ్యయపరచి ఉభయభ్రష్టులగుట ఎరుగుదుము. శరీరవ్యాయామమనిన సిగ్గును, హిందీ నేర్చుకొనుటయనిన ఉత్సాహమునా? హిందీ యెడ వ్యామోహముగల ఆంధ్రులకు ఆంధ్రభాషయొక్క నేటిస్థితి ఏమైనను మనస్సుకుపట్టినదా? ఉదాహరణార్థము ఒకలక్షణమును మాత్రమే చెప్పెదము ఇప్పుడు మన తెలుగుభాషలో చిన్న పిల్లలకుతగినట్టియు,వస్తువులనుచక్కగ బోధించు బొమ్మలుగలిగినట్టియు, మంచిరసవంతమగు తెలుగుభాష, ఎంతసూక్ష్మాతిసూక్ష్మాంశముల నైనను చెప్పుటకుతగినట్టిది నేర్పునట్టియునగువాచకములుఇంగ్లీషుభాషలోనుండునటువంటివిలేవని శాస్త్రవేత్తలయొక్కయుఅనుభవశాలురయొక్కయు అభిప్రాయమైయున్నది.అట్టివాచకములను తయారుచేయవలెననిన ద్రవ్యవ్యయము ఎక్కువఅగునందురు. నిజముగా ప్రస్తుతము దేశవిముక్తితో ఎక్కువసంబంధములేని హిందీఅభివృద్ధికై వ్యయముచేయుటకు లభించుద్రవ్యము రేపు మనతర్వాత మన దేశభాగ్యమును మనమెవరికి అప్పగించబోవుచున్నామో అట్టి నేటి బాలబాలికల సంస్కరణకు అవసరమగు విద్యకు గట్టిపునాదివలె ఉపకరించగల మంచి తెలుగువాచకములను తయారు చేయించుటకై లభించరాదా? ఇంతలో ఉన్నది ఆంధ్రుల తెలివి.

హిందీభాషను అది మాతృభాషకానివారలు నేర్చుకొనుటవలన గాంధిమహాత్ముడు ఉద్దేశించినది హిందీ ఇంగ్లీషుకంటె చాల సులువుగ జనసామాన్యముచే నేర్చుకొనవీలైన భాషగనుక అదిదేశీయులందరు నేర్చుకొనినచో భిన్న రాష్ట్రముల జనసామాన్యము ఒకరితో నొకరు వ్యవహరించుకొనుట సులువగునని మాత్రమే ఆమాత్రపు వ్యవహారమునకు ఆంధ్రులు మొదట తమకుప్రధానమైన దిచూచుకొని, తర్వాత తీరికనుబట్టి అవసరమైనంతమట్టుకు హిందీ నేర్చుకొనిన చాలదా? అట్టిదానికి, అప్పుడే కొందరు ఆంధ్రులు మద్రాసు విశ్వవిద్యాలయమునకు హిందీపాఠ్య ప్రణాళిక దక్షిణభారత హిందీప్రచారసభవారి ప్రణాళికకంటె చాలా తేలికగానున్నదనియు, అది మంచిదికాదనియు, ఆంధ్రపత్రికలో ఆక్షేపణలు ప్రారంభించినారు.ఏదో సామాన్య వ్యవహారమునకై నేర్చుకొనుభాషకు పాఠ్యప్రణాళిక కఠినముగా చేయదగినదని ఆంధ్రుడు చెప్పవలసిన మాటకాదు. ఆంధ్రులకు హిందీలో పాండిత్యము ఎన్నటికిని ప్రధానముకానేరదు. ఒకవేళ, ఇంగ్లీషువిద్యయొక్క అవసరము తప్పనంతకాలము, తన మాతృభాషేతరభాషలో గొప్పపాండిత్యము ఉన్ననేగాని జీవనముగడచుట దుర్భరమగునట్లు చేయుపరిస్థితులు వచ్చునట్లున్నను ఆంధ్రులందరును నేడే సమ్మేళనమై అట్టిపరిస్థితులను రాకుండ ఎదిరించవలెను. లేనిచో భావిచరిత్రలో ఆంధ్రుడు పౌరుషహీనుడుగ లిఖించబడుట తప్పదని గుర్తించవలెను. ఆంధ్రుడు ఇతరులతో వ్యవహారమునకు ఎంతవరకవసరమో అంతవరకే హిందీని ఉంచదగును.

లేకపోతే పాలకొల్లు మునిసిపాలిటీ వారలు ఏమనుకొని వారి హైస్కూలులో హిందీభాషను నిర్బంధము చేయదలచిరి? ఆంధ్రుడు ప్రధానమంత్రిగాను, ఇప్పుడు ఆంధ్రుడు ఆక్టింగు గవర్నరుగాను నుండు మద్రాసు రాష్ట్రముయొక్క ప్రభుత్వమువారు పాలకొల్లు మునిసిపాలిటీకి సరియైన బుద్ధిచెప్పినారు. ఆ ప్రభుత్వమువారి ఆజ్ఞ ఇదేసంచికలో స్థలాంతరమున ప్రకటించబడియున్నది ప్రతివిద్యార్థియు హిందీ నిర్బంధముగ నేర్చుకొనునట్టి ఏర్పాటుచేయకుండ,ఇప్పుడు పాఠ్యక్రమ ప్రకారము నేర్చుకొనవలసియుండు ఇతరవిషయములను సరిగా నేర్పువిషయమున ఆటంకములు కలిగించకుండ, హిందీనేర్పు ఏర్పాటు చేయుటకు పూర్వము బళ్ళలో ఆరోగ్యపరిస్థితులకు విద్యార్థుల శరీరబలపోషణకు తగిన అవకాశముల నేర్పరచి తర్వాత ఇంకను ద్రవ్యమున్నచో హిందీనేర్పు ఏర్పాటుకు తలపెట్టవచ్చునని మద్రాసు ప్రభుత్వమువారు ఉత్తరువును జారీచేసినారు. ఈఉత్తరువునందలి వివేకమును కాదనగల వివేకి ఎవడును ఉండజాలడు

ఈరోజు ప్రభుత్వము ఇంగ్లీషును నిర్బంధముగ నేర్చుకొనవలసిన అవసరమును, పరిస్థితులను తొలగించక హిందీనికూడ నిర్బంధముగ నేర్చుకొనవలసినట్లుచేయు విధానమునకు అంగీకరించుచో, రేపు ఇంకకొందరు పనిలేనివారు చేరి ఇంకొక భాషపై వ్యామోహము దెచ్చిపెట్టుటయు మరల అదియు నిర్బంధము చేయుబడుటయు— ఇట్లు నానా భాషల పాండిత్యము సంపాదించుటతో మన పుణ్యకాలము పూర్తియగుటయు సంభవించును. ఇట్టి దురవస్థ పిచ్చిపట్టిన ఆంధ్రులకు తటస్థించకుండ మదరాసు ప్రభుత్వము వారు "హిందీవెల్లువ"కు కట్టకట్టినారు.

హిందీయొక్క వేగవ్యాప్తి సహించజాలని శ్రీయుత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ "ప్రబుద్ధాంధ్ర" ద్వారా హిందీవల్ల ఆంధ్రభాషకును, ఆంధ్రసారస్వతమునకును చేటుగల్గుచున్నదని గొంతు రాపిడిపుట్టు నంతవరకు ఘోషించి ఘోషించి పండుకొనినారు. వారిఘోషను సమాధాన పరచుటకై హిందీప్రచారకులు హిందీవ్యాప్తి ఆంధ్రభాషాపుష్టికే తోడ్పడును కాబట్టియే తాము హిందీప్రచారముచేయుచున్నామనసాగిరి. ఈప్రకారముహిందీయే తప్పగాక మరియేఇతరభాషఆంధ్రభాషకు పుష్టినికలిగించలేదు? శ్రీపాదవారి మితిమీరిన ఘోషలోనంతయు ఒక్కటే దృష్టి స్పష్టముగనున్నది. ఆంధ్రుల వాస్తవాభివృద్ధికి ప్రథమావసరములగు వాటికి విడివిడిగ వ్యక్తులుగాని, సామాన్యములైన సంఘములుగాని ద్రవ్యమును సంపూర్ణముగ నీయజాలని స్థితిలో— సమిష్టిగ ఆంధ్రసంఘముయొక్క ద్రవ్యము అట్టివానికై వినియోగించబడవలసియుండ, ఆంధ్రులలో కొందరు హిందీప్రచారకులై లభించుకొద్ది ద్రవ్యమును ఇతరముఖముల ప్రవహించజేయుచు ఆంధ్రభాషాపుష్టికే తోడ్పడుచున్నామని చెప్పుచుండుట, విలింగ్డను గారి ప్రభుత్వము భారతదేశమునుండి బంగారునంతయు బైటికి పోనిచ్చుచు అదంతయు భారతదేశమునకు లాభమే అనినట్లున్నది.

---

## మ. ఘ. వ. నైజాం స్టేటు రైల్వే ప్రకటన

స్టేషనులు మూసివేయబడుట

(a) రాబోవు 1వఆగస్టు 1936 శని వారమునుండి యీక్రింద 12 రైలుస్టేషనులు పెద్ద, చిన్న లైనులు మీదివి అన్ని విధములయిన రవానా పనులకు మూసి వేయబడును.

| స్టేషను పేరు | స్టేషనువున్న |
|---|---|
| పెద్దలైను | |
| 1 నష్దరునగరు | (సికింద్రా |
| 2 బెల్లకరగ | (వికారా, పర్లివైజ్యనా |
| 3 లావరా | ( డిటో |
| 4 సిద్దేశ్వర్ | ( డిటో |
| 5 ఖానాపూరు | ( డిటో |
| (నైజాం) | |
| 6 దూకుడి | (ఖాజీపేట-బలహర్షా |
| చిన్నలైను. | |
| 7 జానకంపేట | (సికింద్రాబాదు పూర్ణా) |
| 8 మార్సుల్ | (హింగోలి (బ్రాంచి) |
| 9 దామిని | ( డిటో |
| 10 వార్దగాం | (పర్భని-పర్లివైజనాథ్ |
| 11 ధోండి | ( డిటో |
| 12 సింగనపూరు | ( డిటో |

(b) అదేతారీఖునుండి యీ క్రింది చిన్నలైను స్టేషనులలో వార్ఫులుగూడ్సు రోజుకు 81 మణుగులవరకు యితరరైళ్ళకున్ను యీ రైల్వేలోను బుక్కింగు చేయబడును.

1 ముగట్
2 పెయిద్ గాం
3 మొలోరాబోడ్
4 తారూరు

బైఆర్డరు
ఎ. డబ్ల్యు. వాట్సి

సికింద్రాబాదు
1-7-19*6. చీఫ్ట్రాఫ్ఫిక్ మేనేజర్ సూపరింటెండెంటు—

## విశాఖపట్టణము రేవుపనివారల కన్యాయము

### వి. వి. గిరిగారిఉపన్యాసము

విశాఖపట్నము జూను ౨౭ — విశాఖపట్నము హార్బరు, పోర్టుపనివాండ్ల సంఘసమావేశము పురమందిరములో జరిగెను శ్రీయుత వి వి గిరిగారు అధ్యక్షతవహించిరి వారి ఇంగ్లీషుపన్యాసము తెలుగునను, ఉర్దూభాషలోను తర్జుమా చేయబడెను.

"బెంగాలు-నాగపూరు రైల్వేలోఉన్న ౫౦ వేలు పనివాండ్రలోను మూడువేలమంది సంఘసభ్యులుగ చేరినారు. అందుచేతనే ఇతర రైల్వేకంపెనీలు పనివాండ్రను తగ్గించునప్పుడు బి ఎన్. రైల్వేవారు పనివారిని తగ్గించుటలేదని ప్రకటించినారు. బి ఎన్. రైల్వేపనివాండ్ర సంఘబలమువలననే ఇది సంభవించినది. మీరు సంఘముగా ఏర్పడియుండినయెడల ఇంతవరకువచ్చిన తగ్గింపులు సంభవించక పోయెడివి.

వి. వి. గిరిగారు

మీరందరును నూటికినూరుగురు సంఘములో చేరినపుడే, మీయునియను ధృఢమై బలవంతులైనప్పుడే మీకోరికలు అధికారులు గుర్తించెదరు

నాగరికతగల ప్రతిప్రభుత్వమును ప్రతివారికిని ఉద్యోగ మీయవలసిఉన్నది. కాని ఈవిషయమున భారతప్రభుత్వము విఫలమైనదని చెప్పుటకు నేను విచారపడుచున్నాను. ఇంత పెద్దహార్బరులోను ౪౦౦ మందికి పనికల్పించలేకపోయిరి. పనివాండ్రను తగ్గింప నవసరము లేదని నాఅభిప్రాయము. పనివాండ్రు ఉద్యోగమునుండి తొలగింప బడుచున్నపుడు వైభవోపేతమగు వేతనములు ఆఫీసరులు స్వీకరించుట మన మెరిగింతుము. పనివారిని తగ్గించునపుడు వారికి నష్టములేని మరికొన్ని పద్ధతులున్నవి నైజాముస్టేటు రైల్వేలోని లాలాగుడ వర్కుషాపులో పనివాండ్రను తగ్గించునపుడు వారికి ఆరునెలల వేతనములిచ్చినారు."

విూలో చాలమంది పదునైదు సంవత్సరములు, కొందరు ౯ సంవత్సరములు ఉద్యోగము చేయుచున్నను తాత్కాలిక ఉద్యోగులుగానే గణింపబడుచుండుటవిని నేను ఆశ్చర్యపడుచున్నాను. రాయలు కమీషనువారు ఒకసంవత్సరము పనిచేసినవారు శాశ్వతపనివారుగ గణింపబడవలెననియు, ప్రివిలేజిలీవు, ప్రావిడెంటు ఫండుకు హక్కుకలిగియుండవలెననియు చెప్పిరి.

ఇచ్చట పనివాండ్రను తగ్గించుటలో కొందరియెడల పక్షపాతము చూపబడెనని వినియున్నాను. ఇట్టివిషయమును పరిశీలించుటకొక ఉపసంఘము నేర్పరచుట ప్రభుత్వము వారివిధి.

తుదకు గిరిగారి సూచనలుగల తీర్మానములు చేయబడెను. పనివాండ్రకష్టములను నివేదించుటకై డాక్టర్ యం. కృష్ణారావుగారు అధ్యక్షులుగను, వి.వి. గిరిగారు ఉపాధ్యక్షులుగనుగల ఒకసంఘము ఏర్పరచబడెను.

## పురుషుడు స్త్రీగా మారుట

ఇంతవరకును స్త్రీలు పురుషులుగా మారుట వినియున్నాము స్త్రీల పురుషలక్షణము లగు అవయవములుగలవనియు అవిసరిగా వికసించుకో స్త్రీ పురుషుడుగా మారుననియు సైంటిస్టులు చెప్పుచున్నారు. కాని పురుషునిలో స్త్రీ అవయవమున్నట్లు వినలేదు అందుచే పురుషుడు స్త్రీగా మారునాఅను సంశయము ఉన్నది.

ఇప్పుడు,ఇంగ్లాండులో ఒకపురుషుడు స్త్రీగా మారినట్లు ఒకవార్తవచ్చినది, నార్మన్ ఫిషర్ అనువతడు బాత్ లో స్త్రీలదర్జీవాడు. అతనికి ౪౧ ఏండ్లు అతనిపై గొప్పనేరము మోపబడెను ఆనేరమును విచారణచేయుచుండిన, సోమర్ సెట్ అసైజెస్ కోర్టుయొక్క ఒడ్డి వైద్యపరీక్ష చేయించగా, వైద్యులకు అతనిలో స్త్రీలింగలక్షణములు కనిపించెనట. వారలుపూర్తిగా పరీక్షించి అతడుక్రమముగా స్త్రీగా మారుచున్నాడని తెలిపిరి. ఇదివరలో ఇట్టిది ఒక సందర్భమునమాత్రమే వారెరుగుదురట. లండనులో గొప్పగొప్ప నిపుణులు అతనిని ఒకస్పెషల్ ఆపరేషను చేయించుకొనవలెనని చెప్పిరి. కాని ఆపరేషను చేసినతర్వాత అతడు స్త్రీయగునో పురుషుడుగనే ఉండునో వైద్యులు చెప్పజాలనందున అతడు ఇంతవరకును ఆపరేషను చేయించుకొనలేదు.

## మాళవ్యాగారు వైస్రాయిని సందర్శించుట

సిమ్లా, ౩ జులై.— పండిత మదనమోహన మాళవ్యాగారు సిమ్లాకువచ్చి వైస్రాయిని దర్శించిరి. ఒమాలకు ఇండియాయొక్క ప్రస్తుతరాజకీయ పరిస్థితుల నుగూర్చిమాట్లాడియుండవచ్చును. కాంగ్రెసు భావములుగల నాయకుడు క్రొత్తవైస్రాయితో సంభాషించుట కిదియే ప్రథమము ఆరోగ్యము బాగుచేసుకొనుటకై ముఖ్యముగా సిమ్లాకువారువచ్చినట్లు తెలియుచున్నది.

మూంజిగారు ఇచ్చటనేయున్నారు మూంజీగారు మాళవ్యాగారు చాలసేపు సంభాషించుకొనిరి,

## భారతసంస్థాన ప్రజలమహాసభ జరుగు తేదిమార్పు

కరాచీ, ౪ జూలై:— ఈనెల ౧౧,౧౨ తారీఖులలో సంస్థానప్రజలసభను జరుపుటకు యిదివరకు నిర్ణయించియుండిరి. కాని కాంగ్రెసు మహాసభాధ్యక్షుడగు పండిత జవహర్లాల్ నెహ్రూగారు తమ సింధుపర్యటనము నుకారమునొల్లలు అలస్యముగా జరుపనిశ్చయించుటచే సంస్థానప్రజలసభను ఈనెల ౧౮,౧౯ తారీఖులలో జరుపుటకు తత్సభయొక్క ఆహ్వానసంఘమువారు నిశ్చయించిరి సంస్థానములయందలి సంస్థలును, సంస్థానములకు వెలుపలనున్న సంస్థలును ఈనెల ౧౫ తారీఖులోగా సూచనలు పంపవలెనని కార్యదర్శి కోరుచున్నాడు.

కామినియా సాండల్ సోప్ రిజిష్టర్డు

హిందూదేశమునకు అదర్శప్రాయమైనసబ్బు. మిక్కిలికోమలమైన చర్మమును ఉష్ణదేశముయొక్కవాతావరణమునుండి రక్షించుటయేగాక చర్మమును సంపూర్ణముగశుభ్రపరచి ఉల్లాసకరమైనట్టియు, కోమలమైనట్టియుగంధపుచెక్కయొక్కసువాసనకలిగియుండును వెల 3 బిళ్లలుగలపెట్టె 1కి అణాలు 14. ఖర్చులు వేరు

ఆడాన్ ఎసెన్స్ సాల్వ్ (రిజిష్టర్డు)

జలుబును, మేహవాతనొప్పులను తప్పకకుదుర్చు ఔషధము

జలుబును ఎప్పుడును నిర్లక్ష్యముచేయకుడు. సువాసనగల ఈసాల్వును మెడకు, రొమ్మునకు, భుజములకును మర్దించినయెడల తప్పక ఉపశమనము కలుగును. ఆరంభదశలో ముక్కుమీదకొంతపూసి పరిశుభ్రపరుచు దీనివాసనను చూడవలెను. మేహవాత నొప్పు నివారించుటకై నొప్పులున్న చోట మర్దించినయెడల సైవ్రన్ సాల్వ్ చిన్నచిన రంధ్రములద్వార లోపలప్రవేశించివెంటనే నొప్పిని, పట్టుతగ్గించును.

ఎల్లచోట్లలో దొరుకును—వెల బుడ్డి 1కి రు. 1-0-0. వి.పి. ఖర్చులు వేరు

3 బుడ్లకు రు. 2-8-0

2 అణాలు పోస్టుబిళ్లలుపంపినచో శాంపిలు ఉచితముగా పంపబడును

సోల్ ఏజెంట్లు:—దిఆంగ్లో యిండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ, బొంబాయి. 2.

నోటు-స్త్రీలకు టికట్లు ఇవ్వబడవు

రాయల్ టాకీసులో

మజ్నూ లైలా

ముఖ్తారుబేగం, అమీరుబేగం, మిస్. శ్యామా, పేరల్లులోయెన్ సుల్తానుబేగం మరియు (౨౦౦) ఇతరులు

ప్రతి ఆది శుక్రవారము రోజులయందు మధ్యాహ్నము ౨-30 గంటలకు తక్కువటికట్టుపై ఒక పెద్దఆట చూపబడును-

వెస్టెండు టాకీస్

నేటి రాత్రి

దేవదాసు

సైగల్, నానియాల్, నవాబు, కేసీడే, ఫుమా

ఒక మహాచిత్రమైన తెలుగటాకీ

రీగల్ టాకీసులో

భక్త ప్రహ్లాద

నటులు

రత్నప్రభా

మాస్టర్ క్రిష్ణకాంత

సెంట్రల్ టాకీసు

మరమ్మతు చేయబడుచున్నది

కృష్ణాటాకీసు

నేటిరాత్రి

శేర్ హిందు

నటీనటులు

నూర్ జహాన్,

బూమన్ షరాఫు,

ఫౌలీటాకీసు

Atale Of TWoCites

(రెండు నగరముల చరిత్ర)

# దేశములేనిజాతికి దేశముకల్పించినచో...

౧౬ వ పేజీ తరువాయి

చ్చునా యున్నవి. అరబ్బు భూస్వాములు తమతమ భూములను కలలోకూడ తలచి యెఱుగని పెద్ద మొత్తములకు యూదులకు విక్రయించి యున్నారు. యూదులపై వేయబడిన పన్నులనుండి వచ్చిన ధనముతోడనే అరబ్బు ప్రజాసామాన్యమునకు వలయు సాంఘిక సౌకర్యములు సమకూర్పబడినవి, అసుగాక! పరిపాలనము ఎంత సక్రమమైనది సమంజసమైనది ఆయినను అది స్వపరిపాలనము కాక పోయినచో అది తుదనెగ్గజాలదను విషయము ప్రత్యక్షీకరించుటకు పాలస్తానము ప్రపంచచరిత్రలో మొదటి దేశము కాదు.

పాలస్తానమునగల సారవంతమైన భూమియంతయు క్రమముగ అరబ్బుల చేతులనుండి యూదుల చేతులలోనికిపోవుటను అరబ్బుజాతీయులు కనుగొన్నారు. యూదులరాకతో తమ దేశమునకు పాశ్చాత్యనాగరికతా ప్రసారమువలన పరిపూర్ణలాభములుకలుగుచున్నవను వాదముతో అరబ్బులు ఏకాభిప్రాయులు కాలేకుండ నున్నారు. తమతో చర్చింపబడకుండగనే తమదేశమును ఇతర దేశములనుండి తఱుముగొట్టబడిన యూదులకు దత్తము చేసియుండుటకు అరబ్బుజాతీయులు ఆగ్రహావేశులగుచున్నారు. ఇంగ్లండు ఇంగ్లీషు వారిదిగా చేయబడినంత సమగ్రముగా పాలస్తానము యూదులదిగా చేయబడవలయునను యూదునాయకుల వాక్యములు వారి చెవులకు ములుకులగుచున్నవి, ఆ యూదుల తెంపు లేనిరాక కాలక్రమమున తమ దేశమున తమ్ము బానిసలనుగా చేయగలదని వారు భయపడుచున్నారు. ఇంగ్లండులో యూదులు మంచిపలుకుబడి కలిగియున్నారు. కాగా తమ్ముమాట అక్కడ ఒకపట్టున వినిపించుకొనువారు ఉండరు. అసలు అరబ్బులు తమదేశమున తమ ఇచ్ఛాంశములు ఇతరులు గ్రహింపగలుగుటకుగాను సమ్మెలు, సహాయనిరాకరణము, విప్లవములు, రాజకీయపుటాందోళనతో కూడిన అలజడి సాధనములుగా గైకొనినారు.

ఆధునిక పాలస్తానసమస్య ఇదియే. నిరుటి కంటె ఈయేటి బడ్జెటులో పదిలక్షల పౌనుల సర్‌ప్లస్ వచ్చినది. 1935 వ సంవత్సరమున క్రొత్తగా పాలస్తానమునకు వలస వచ్చినయూదుల సంఖ్య వెనుకటియేడు వత్సరముకంటెను గూడ అధికమైయున్నది. చెదురుపాటుగా అప్పుడప్పుడు అరబ్బులకును యూదులకుకలిగినసంఘర్షణలు చినికిచినికి ఇప్పుడు అరబ్బుజాతికిని నడుమ గొప్ప విరోధముగా ప్రబలియున్నవి. దేశమంతయు ఇప్పుడు సైనికుల బందోబస్తులో నున్నది. అరబ్బునాయకులు పద్ధతిని మార్పు కొన ప్రభుత్వమువారిని ఒత్తిడి చేయుచున్నారు యూదునాయకులును ఆందోళన చేయుచున్నారు. భూముల అమ్మకము విషయములో కొని ప్రజాప్రాతినిధిక ప్రభుత్వ స్థాపనమున కొని ఎట్టి కన్సెషనులను ఈయరాదని పట్టుపట్టుచున్నారు.

ఒకటి ఏటికి—ఒకటికోటికి ఇందుపై ఒక్కొ పార్టీని ప్రభుత్వము అభిమానించినను పాలస్తానము మరుతుకణము రక్తసంప్లావితమగుట నిశ్చయము. అరబ్బు, యూదుజాతుల రెండింటి నడుమను సమరస భావము నెలకొల్పబడుచో బ్రిటిష్ సామ్రాజ్యపు చరిత్రయందు అదియొక మహాకార్యము కాగలదని కేల్ఫుట్ వాటుచున్నాడు.

## చాకలి వాండ్ర సమ్మె

### ఆఫీసులకు కోర్టులకు వెళ్లువారు మాసినగుడ్డలతో పోవలసి వచ్చుట

క్రొత్తఢిల్లి, జులై 1:—

సుమారు 3000 మంది బండ్లవాండ్రు, 500 మంది చాకలివాండ్రు ఢిల్లీలో సమ్మెసాగించుచున్నారు. గుమాస్తాలు, న్యాయవాదులు, కోర్టునకువచ్చినవారు చాలదూరము నడచిపోవలసి వచ్చుచున్నది. వీధులలో మాసిన గుడ్డలతో వీరు నడచివెళ్లవలసివచ్చుట సమ్మెఫలితమే. జనసామాన్యమునకు చాల ఇబ్బందిగా నున్నది. ట్రాములు, బస్సులు ఎక్కువగా డబ్బు సంపాదించుకొనుచున్నవి.

చాకలివాండ్రు యమునవంతెనకు రెండుప్రక్కల గుడ్డలు ఉతుకుచుండిరి. స్నానము చేయుచోట గుడ్డలు ఉతుకుట అనారోగ్యమని హిందూసభవారు, తదితరులు అధికారులకు విన్నవించిరి. వంతెనకు ఒకప్రక్కనే గుడ్డల నుతుకుచుండవలెనని మునిసిపాలిటీవారు ఉత్తరువు చేసిరి. చాకలివాండ్రు సివిలుదావా దాఖలుచేసిరి. కాని దావాలో ఓడిపోయిరి. ముందుగా హెచ్చరిక గావింపకుండానే చాకలివాండ్రు నాలుగుదినములనుండి సమ్మెకట్టిరి. సమ్మెకట్టుమండి పోయినవారికి అపరాధాలే.

మునిసిపాలిటీ వాగ్దానము చేసికూడ బండ్లకు ప్రత్యేకపాకలను నిర్మింపనందున తమ అసమ్మతిని వెల్లడించుటకుగాను బండ్లవాండ్రు సమ్మె కట్టిరి. సమ్మెకట్టిన గుఱ్ఱపుబండ్లవాండ్రు తదితరబండ్లవాండ్రను గూడ తమలో చేర్చుకొనుటకు కృషిసలుపుచున్నారు.

క్రొత్తఢిల్లీ, జులై 2:—

సమ్మెకట్టును త్వరలో రద్దుపట్టింతురనుటకు సూచనలు కనబడుటలేదు. బండ్లను తోలువారు నేటిరాత్రి సభచేసి, తమ సమ్మెకట్టును కాలనిర్ణయములేక సాగించుటకు నిశ్చయించిరి. తన్నిమిత్తమై ఒక కమిటీనిగూడ ఏర్పాటుచేసిరి. చాకలివారుగూడ వారి పంచాయతీకోర్టును నాలుగు దినములనుండి జరుపుచున్నారు. ఢిల్లీమునిసిపాలిటీకిని తమకును కలిగిన ఈవివాద విషయములలో జోక్యము కలుగజేసుకొనకోరుచు రాజప్రతినిధిగారికిని, ఢిల్లీరాష్ట్రప్రధాన కమిషనరు గారికిని ఢిల్లీచాకలివారు తంతులు నంపిరి.

తమతగాదా అనుకూలముగా పరిష్కరింపబడువరకు ఎవ్వరును గుడ్డలను చలువచేయరాదని చేసుకొనబడిన తీర్మానమునకు విరుద్ధముగా ఒకచాకలి గుడ్డలుతికె నందున నాయకులు వానిమీద చర్య దీసుకొనుచుండిరి. అందుచేత ఏడ్గురు చాకలి నాయకులు కూడ అరెస్టు చేయబడినట్లు తెలియుచున్నది.

సమ్మెకట్టినవారు దుర్మార్గమునకు దిగినట్లు కొన్ని కేసులు తెలియవచ్చుచున్నవి. వీధులలో తిరుగాడు పిల్లవాండ్లు ఆ అల్లరులందు చేరుచుండిరి. స్వంతబండ్లను కలిగియున్న ఆ బండ్లను తోలువారినిగూడ సమ్మెకట్టినవారు నిర్బంధించుచున్నారు. వారు సమ్మెలో జేరుటకు నిరాకరించుటచేత వారియెద్దులను బండ్లనుండి విప్పిలోలుకొనిపోయిరో, లేక రబ్బరు చక్రములలోని గాలిని వదలివేసిరో అసమ్మెదారులు ఆటంకపరచుచున్నారు. పోలీసులు సహాయమునకు వచ్చుటచేత యీ ఆటంకములు తొలగినవి.

### బొంబాయిలో

బొంబాయి నగరములో పురపాలక సంఘాధికారియగు మేయరు ఎట్టిచర్యగానీ గైకొనకున్నను, అక్కడకూడ మంచి ఏర్పాటు (అనగా అగ్నిప్రమాదమునకు అవకాశమీయని ఏర్పాటు) లేని సినిమాహాలులపై సెన్సును కొట్టివేయుట ఆవసరమని బొంబాయి క్రానికల్ పత్రిక హెచ్చరించినది.

## నడుముక్రిందిభాగమునకు మాత్రమే తగిలిన ఎఱ్ఱనీటివాన

### బెంగాలులో రంగపూరులో జరిగిన అద్భుతము

బెంగాలులో రంగపూరులో కలక్టరుకచేరికి ఈశాన్యభాగమునందు నొక ప్రదేశమున నొక విశాలమగు మఱ్ఱిచెట్టుకలదు. దానిదిగువయిటుకలతో కట్టబడిన చిన్నదేవాలయము మున్నది. ఆదేవాలయమున శ్రీమదాంజనేయమూర్తి విగ్రహమున్నది. ప్రజలు ప్రతిదినము ఆవిగ్రహమునకు పూజచేయుచుందురు. ఈ మధ్యనొక నాడు ముగ్గురుబాలురు సాయంకాలము 6 గంటలప్రాంతమున యేదోపనిమీద నచటికివెళ్లగా నిష్కారణముగా వారిపైనిరక్తవర్షము కురిసినది.

మొదట నేదో ప్రవాహము వచ్చుచున్నట్లు ధ్వని వినబడినది. పిమ్మట రక్తపుధారలు విస్తారముగా పడసాగినవి. నడుమునుండి పాదముల వరకు రక్తపు మరకలు కలిగినవి. వారు నిర్ఘాంతపోయి చేరువనున్న యొక చెరువులో బట్టలు కడుగుటకు వెళ్లిరి. వారు తొడుగుకొన్న చొక్కాలపైని రక్తపు మరక లేవియును లేవు. అవి చాల శుభ్రముగా నున్నవి, గాని కట్టుకొనిన బట్టలపైని మాత్రము రక్తపుమరకలు విస్తారముగా నుండెను. వారు ఇండ్లకుపోయి చెప్పగా గ్రామస్థులు చాలమంది అచటికివెళ్లి చూచిరి. అచట భూమిమీద రక్తపుమరకలేవియును కనబడలేదు. ఆనాడు అంబా దినము జరిగిన తంత్రమును తంత్రశాస్త్రమును ననుసరించి రంగపూరు ప్రాచీనమగు కామరూపమునందొక భాగమైయున్నది. గాన ఆచెట్టుపైనున్న దేవతయే రక్తమునువర్షింపజేసెనని కొందరనిరి. వారి బట్టలపైనున్న రక్తపుమరకలను యంత్రసహాయమున పరీక్షించుటకు వీలులేక పోయినది. అని రంగపూరు సంస్థానమునందలి అనరిక బజారుపత్రిక ప్రకటించినది.

## నానాజాతిసమితికి రాబోవు సమావేశము

### భారతదేశ ప్రతినిధి

కలకత్తా జులై ౧.

వచ్చే సెప్టెంబరు నెల జనీవాలో జరుగనున్న నానాజాతి సమితి జనరలు అసెంబ్లీకి భారతప్రతినిధులలో పి. సి. విశ్వాసు గారిని నియమించినటుల తెలియుచున్నది.

WEST END 'SECUNDUS'

వెస్టయెండ్ "సెకండస్"
తక్కువ ఖర్చుతో ఎక్కువకాలము పని
చేయుటకు శ్రేష్ఠతమమైన గడియారము

నికెల్ సిల్వర్ రూ. 3-8

WEST END WATCH Co

BOMBAY CALCUTTA

ధూమ్ర

ఋతుశూలవలన బాధపడుస్త్రీలు 'ధూమ్ర'ను వాడి దైవచిత్రమును గాంచవలయును.

ఎనిమిది దినములకు సరిపడుమందు

1—8—0

మేనేజర్, యస్. వీరరాఘవాలయం

హనుమకొండ.

వరిప్రసాదము

శస్త్రకాసవము:— దేహములో రక్తముజనించి శక్తిహీనులకు బలముకలిగించు దివ్యౌషధము మావద్దనే లభించును. ప్రతివ్యాధికిచికిత్సచేయుసమయము ఉ.7 నుంచి11 వరకు 4 నుంచి 8 వరకు.

కవిరాజవైద్యశాల

ధూళిపేటరోడ్డు, హైద్రాబాదుదక్కన్.

# ఆంధ్రులు

స్థాపించిన

## దక్కన్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్,

[ బెజవాడ. ]

యందు

## భీమా చేయుడు

స్త్రీపురుషులకు యొకటే క్రెస్తు } పలుకుబడిగల ఏజంట్లు కావలెను.

నండూరి వేంకట కృష్ణమచార్యులు, బి. ఏ.

1488, స్టేషన్‌రోడ్డు, హైద్రాబాదు (దక్కన్).



### కలరా కలరా

...లేదు ...తి జెంచి కుడు.

...రాకు దివ్యౌషధము

...డ్రాప్సు మిమ్ము కాపాడగలదు.

...వాంతి, అతిసారము, కలరా రక్త ...గనములు, కడుపుబ్బరములు అజీర్ణము, వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును. రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరా వలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును. అనేకులు మా విక్టర్‌డ్రాప్సును ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరా వ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్‌డ్రాప్స ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికిని నిర్భయముగావాడవచ్చును.

హోల్‌సేజంట్లు: విక్టర్ అండు కో
పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్
దవాఖాని, విక్టర్ అండుకో
సుల్తానుబజారు






ఫోను రికార్డుల భవనము

అన్ని రకముల తెలుగుగ్రామఫోను రికార్డులు మావద్ద దొరకును. స్త్రీలువచ్చి చూచుటకు ప్రత్యేకమగు ఏర్పాటుగలదు.

బి. జి. చిమల్గి
జాంబాగు, హైదరాబాదు దక్కన్.





### డోంగ్రేగారి
## బాలామృతము

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను బలమున్ను, ఆరోగ్యము నిచ్చును.

అన్నిస్థలములందు దొరకును,

ప్రొప్రయిటరు:—

కె. టి. డోంగ్రే అండ్ కో
గిర్‌గాం-బొంబాయి.



## సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, లిమిటెడ్

హైదరాబాదు, సికింద్రాబాదు.

మేము మాయీ రజతోత్సవ సందర్భములో వసూలునకై మా పరముగావచ్చు బిల్లులకు నైశ్వరశీకు ఉన్నను లేకున్నను క్రొత్తసంవత్సరమునుంచి వాటివసూలురేట్లను చాలా తగ్గించినామని తెలుపుటకు ఆనందము కలుగుచున్నది.

బిల్లుకు నాలుగుఅణాల కంటెన యిప్పుడుండుచార్జి నిపూర్తిగతీసివేసితిమి వసూలు చార్జీలు నూటికి 4 అణాలనుంచి నూటికి 2 అణాలకు తగ్గించబడినవి, కాని 1 బిల్లుకు కనీసపు ఛార్జీ 4 అణాలు.

ఇందు మాపూర్వపు ఖాతాదారులు ఇంతకుముందుకంటె ఎక్కువబిల్లులు తెచ్చుటకు ఉత్సాహపడుదురని నమ్ముచున్నాము. హిందూదేశమంతటను 80 శాఖలును, పేఆఫీసులునుగల్గి హిందూదేశములో ప్రధానముగ నీజాయింటుస్టాకు బ్యాంకువలన క్రొత్తఖాతాదార్లకుకావలసిన పనులు చాకగాను నిరుపద్రవముగాను నెరవేరగలుగునని నచ్చచెప్పుచున్నాము.

ఇ. థామస్
హైదరాబాదుదక్కన్) శాఖ ఏజంటు.)



### కావలెను.

టెలిగ్రాఫు మరియు స్టేషన్‌మాస్టర్ తరగతులకు అభ్యర్థులు. ఆలవెన్సు రూ ...లా, యూనిఫారం, బస ఉచితము. పని ముఖ్యము. నిబంధనలు ప్రవేశదరఖాస్తుఫారంకు అణాలుపంపినచో పంపబడును. డైరెక్టర్, రాయల్ టెలిగ్రాఫు అండ్ రైల్వే ట్యూటోరియల్ కాలేజి, బొంబాయి,



### శ్రీ కృష్ణ భవన్ రెస్టారెంట్

మిక్కిలి మంచివిగా ఫలాహారములు, మంచిభోజనము, ప్రయాణికులకు విశ్రాంతి సౌకర్యములు అన్నియు చౌకధరలలో లభించగలవు. కేవలము సామానులుకూడ ఇచట ఉంచబడును,

కే. ఎస్. కృష్ణయ్యరు, ప్రొప్రయిటర్.
కింగ్ కోటిరోడ్డు, హైద్రాబాద్ [దక్కన్]

